# ఆంధ్ర రాష్ట్రంలో సాంఘిక సంస్కర్తలు (1890-1920)
# ఆంధ్ర రాష్ట్ర అస్పృశ్యతా నివారణ సమావేశం (1921)
## (శత వార్షికోత్సవ సమాలోచన)




మూలం : **పి. హెచ్. గుప్తా**

తెలుగు : **హరికృష్ణప్రసాద్**



**సేకరణ, ప్రచురణ**

గౌరవ్

సొసైటీ ఫర్ సోషల్ జస్టిస్

ఆంధ్రప్రదేశ్–తెలంగాణ

2020

# ఆంధ్ర రాష్ట్రంలో సాంఘిక సంస్కర్తలు (1890-1920)
# ఆంధ్ర రాష్ట్ర అస్పృశ్యతా నివారణ సమావేశం (1921)
## (శత వార్షికోత్సవ సందర్భం)

మూలం
పి. హెచ్. గుప్తా

అనువాదం
హరికృష్ణ ప్రసాద్

మొదటి ముద్రణ
నాస్తిక యుగం
సామాజిక చైతన్య మాసపత్రిక
1985, నవంబరు-డిసెంబరు సంచిక

ప్రస్తుత ప్రచురణ
గౌరవ్
సొసైటీ ఫర్ సోషల్ జస్టిస్
ఇండియా
2020

ప్రతిపాదిత చందా
10/- రూపాయలు

ప్రతులకు
9032094492

వివరాలకు
gouravmeka@gmail.com

"NINTEEN TWENTY ONE was an extraordinary year for us. There was a strange mixture of nationalism and politics and religion and mysticism and fanaticism. Behind all this was agrarian trouble and in big cities, a rising working-class movement. Nationalism and a vague but intense countrywide idealism sought to bring together all these various and sometimes mutually contradictory, discontents, and succeeded to a remarkable degree"

– Jawaharlal Nehru

Nineteen Twenty One And the First Imprisonment.

XI Chapter, An Autobiography

*** *** ***

**"ఆయన (ఉన్నవ లక్ష్మీనారాయణ) ఒక విషయాన్ని నొక్కి చెప్పారు. హిందూ సంఘంలో కులాల మధ్య భోజన విషయంలో ఉన్నంత పట్టింపు కామానికి కూడా లేదనీ, ఒక కులం వారు మరొక కులం వారితో కలిసి బిడ్డల్ని కన్నప్పుడు కూడా రహస్యంగానైనా భోజనాలు కలిసి చెయ్యలేదనీ, సహపంక్తి భోజనాలు ప్రజామోదమైనప్పుడు వర్ణాంతర వివాహాలు కూడా జరుగుతాయనీ, ఆ తర్వాత కులాలు నశించిపోతాయని చెప్పారు."**

**– దరిశి చెంచయ్య,** నేనూ – నా దేశం, ఆత్మకథ

*** *** ***

**"1921 – కాంగ్రెసు చరిత్రలోనూ ఆంధ్రుల చరిత్రలోనూ అత్యంత ప్రధానమయిన సంవత్సరం."**

**– బూదరాజు రాధాకృష్ణ**

పద్య సాహిత్యం – సంఘ చరిత్ర (1900–1950)

# ప్రవేశిక

భారత నాస్తిక సమాజం పత్రిక 'నాస్తిక యుగం' 1985 సం॥రం నవంబరు, డిసెంబరు నాటి సంచికలో 1921లో ఏర్పాటు చేసిన ఆంధ్రదేశపు మొట్టమొదటి అస్పృశ్యతా నివారణ సమావేశాన్ని గురించి ప్రచురించబడిన వ్యాసం ఇది. పి. హెచ్. గుప్తా గార్ని గురించిన ఇతర వివరాల కోసం విశాఖపట్నం, విజయవాడ మిత్రుల్ని సంప్రదించాను కానీ ప్రయోజనం లేదు. మిత్రుల, కీ.శే. ఎం. సుబ్బారావుగారు హైద్రాబాద్ నుండి నడిపిన Rationalist Voice పత్రికలో 2004, మే, జూన్ సంచికలో గుప్తాగారు రాసిన "Why I gave up my Ancestors Religion" అనే వ్యాసం ఉంది.

భారత నాస్తిక సమాజం అధ్యక్షునిగా కొంత కాలం పనిచేసిన గుప్తాగారు గొప్ప గాంధేయవాదనీ ఐర్లాండ్‌లో చదువుకున్నారనీ, ఉన్నవ లక్ష్మీనారాయణ గారికి మిత్రులని తెలుస్తోంది. చార్వాక విద్యాపీఠం ప్రచురించిన గుప్తాగారి రచన "నా పరిశీలనలో రామాయణం" (అనువాదం : జె. వీరాస్వామి)లో ఆయన గురించి బహుశా బి. రామకృష్ణగారు చేసిన పరిచయం ఉంది. దానినే పునర్ముద్రిస్తున్నాం.

అయితే, ఆ పరిచయంలో "అంటరానితనానికి వ్యతిరేకంగా దేశంలో అందరికీ మార్గదర్శకంగా గుంటూరులో మొట్టమొదటిసారిగా మహాసభ, సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేసారనే" విషయం ఉంది. ఇందులోని వివాదాల జోలికి నేను పోబోవడం లేదు కానీ 1918 లోనే బొంబాయిలో 'అణగారిన కులాల మహాసభ' జరగడం, అందులో 'అఖిల భారత అస్పృశ్యతా నిర్మూలనా ప్రణాళిక' (All India Anti-Untouchability Menifesto) విడుదల చేసినట్లు తెలుస్తోంది.

డా॥ జయగోపాల్ ప్రధాన సంపాదకులుగా, రామకృష్ణ, చలం, సి.వి. కొల్లా సంపాదకవర్గంగా గృహలక్ష్మిగారు మేనేజరుగా వెలువడిన 'నాస్తికయుగం' సంచికలోని వ్యాసంలో పి.హెచ్. గుప్తాగారు 'ఆంధ్ర రాష్ట్ర అస్పృశ్యతా నివారణ సమావేశం' అని స్పష్టంగా పేర్కొనగా 'నా పరిశీలనలో రామాయణం' పుస్తకంలోని పరిచయంలో మట్టుకు దేశంలోనే మొదటి సమావేశంగా ఎందుకు ప్రస్తావించాల్సి వచ్చిందనేది ఆలోచించాల్సిన విషయం. ఏదేమయినప్పటికీ ఆ చారిత్రక సమావేశం గురించిన సమాలోచన ప్రాముఖ్యతని గుర్తించడం అవసరం.

కేరళలో నారాయణగురు స్ఫూర్తితో 1917లో సహోదర అయ్యప్పన్ జరిపిన సహపంక్తి భోజనాలు గొప్ప సామాజిక విప్లవానికి దారితీసి తదనంతర కాలంలో 'యుక్తివాద సంఘం' స్థాపనకి కారణమయ్యాయి. తెలుగులో మాత్రం కనీసం ఆ చరిత్రని తడిమే నాథుడే లేడు. యుక్తివాద సంఘం సారథ్యంలో 2017లో అక్కడి హేతువాద, ప్రగతిశీల సంఘాలు కల్సి దేశం నలుమూలల్నుంచి అందర్నీ పిల్చి 100 సం॥రాల వేడుకలు చేయగా 1910లో మహాకవి గురజాడ బరంపురంలో పాల్గొన్న సహపంక్తి భోజనాల గురించి తెల్సి కూడా ఇతర ఏ వివరాలు మనకి పట్టనట్లు ఊరుకున్నాం.

నిత్య జీవితంలో తెలుగు జాతికి అలవాటైపోయిన నిర్లిప్తతకి సంబంధించి ఇంతకంటే చెప్పడం కూడా దండగే. గాంధీజీ రాష్ట్ర సందర్శన మొదలుకొని అంబేద్కర్ మూక్ నాయక్ పోరాటం, కమ్యూనిస్టు పార్టీ స్థాపన ఇలా అనేక సందర్భాల్ని పురస్కరించుకుని వంద సం॥రాల క్రితం కుల నిర్మూలన కోసం ముందడుగు వేసిన ఒక నిజాయితీ కల కార్యకర్త స్వయంగా రాసిన వ్యాసాన్ని సంఘ సంస్కరణోద్యమం ముఖ్యంగా, కుల నిర్మూలన ఉద్యమాలకి సంబంధించిన ఒక చారిత్రక డాక్యుమెంటుగా భావించి ఇలా పునర్ముద్రించడం జరుగుతోంది. ఈనాడు నిషేదం అయినప్పటికీ నాటి వ్యాసంలో గుప్తాగారు 'హరిజన' పదమే వాడారు, అది యథాతథంగా ఉంచడమైంది. గుప్తాగారి ఫోటో వేరేదీ దొరకలేదు. ఔత్సాహికులెవరైనా పూనుకొని ఆయన ఇతర అముద్రిత రచనలు వెలుగులోకి తీసుకొస్తే సంతోషం.

విమర్శలకు ఆహ్వానం

– గౌరవ్

## అంకితం

## అబ్రాహ్మణులందరికీ...

# పి. హెచ్. గుప్తా జీవిత విశేషాలు

పొలిశెట్టి హనుమయ్య గుప్తాగారు 1892 సం॥రంలో జన్మించారు. ఐర్లాండులో బార్‌ఎట్‌లా చదివారు. అక్కడ వున్నప్పుడే ఐరిష్ విప్లవాన్ని చూశారు. ఐరిష్ విప్లవ నాయకుడు డివేలరా అంటే ఎంతో ఇష్టం. జేమ్స్ కానలీని తుపాకీతో కాలుస్తుంటే కళ్ళారా చూశారు. భారతదేశం తిరిగి వచ్చాక గాంధీగారి స్వాతంత్ర్య ఉద్యమంలో చురుకుగా పాల్గొనడమే కాకుండా ఎ ఐ సి సి కి ఆంధ్రప్రదేశ్ తరఫున కమిటీ మెంబరుగా పనిచేశారు. గుంటూరు జిల్లా కమిటీ కార్యదర్శిగా వుంటూ 1920 ప్రాంతంలో కాంగ్రెస్ పార్టీకి ఉద్యమానికి చాలా సేవ చేశారు. ఆనాటి ప్రముఖులందరితోను ఉద్యమరీత్యా పరిచయమే గాకుండా వాళ్ళందరితో సన్నిహిత సంబంధం వుండేది. అంటరానితనానికి వ్యతిరేకంగా దేశంలో అందరికీ మార్గదర్శకంగా గుంటూరులో మొట్టమొదటిసారిగా మహాసభ ఏర్పాటు చేశారు. మొదటి సారిగా సహపంక్తి భోజనాలు ఆయన ఇంట్లోనే ఏర్పాటు చేశారు. అందరిలా మాటలతో తృప్తిపడక కులాంతర వివాహం చేసుకున్నారు. తన పిల్లలకు కులాంతర వివాహాలు జరిపించారు. 1924లో పల్నాడులో బ్రిటీషువారు స్త్రీలపై జరిపిన దౌర్జన్యాలను ఎదిరించలేని నాటి కాంగ్రెస్ నాయకుల మౌనానికి నిరసనగా కాంగ్రెస్ పార్టీకి రాజీనామా చేశారు. ఆయన వందలాది వ్యాసాలు రచించారు. అన్నీ అప్రచురితాలే! 1973 నుండి 1976 వరకు భారత నాస్తిక సమాజానికి గౌరవాధ్యక్షులుగా వున్నారు. కులం, మతం పోయేంతవరకు ఈ దేశం బాగుపడదని చివరి కాలం వరకూ బాధపడేవారు. ఆయన అనుభవాలు అపారం. ఆయనతో స్నేహం అతి మధురం, ఆయన విజ్ఞానం, సంస్కారం చిరస్మరణీయాలు, మార్గదర్శకాలు, ఆయన తన 89వ ఏట మరణించారు.

**(నా పరిశీలనలో రామాయణం, మూలం : పి.హెచ్. గుప్తా, అనువాదం : డా॥ జె. వీరాస్వామి, నాస్తికయుగం ప్రచురణలు, మంగళగిరి – 1986)**

* * *

# ఆంధ్ర రాష్ట్రంలో సాంఘిక సంస్కర్తలు (1890-1920)

**మూలం :** పి. హెచ్. గుప్త **అనువాదం :** హరికృష్ణ ప్రసాద్

* * *

నా విద్యార్థి దశ తొలిరోజుల్లో ఆంధ్రరాష్ట్రమంతటా అనేకమంది సాంఘిక సంస్కర్తలుండేవారు. వారు అనేక సమావేశాలు జరిపేవారు. వారు మనస్ఫూర్తిగా సాంఘిక సంస్కరణ జరగాలనే ఆశించేవారు. ఆ రోజుల్లో ఎవరో ఒకరిద్దరు తప్ప యింకెవ్వరూ ఈ సాంఘిక సంస్కరణలను వ్యతిరేకించేవారు కారు. అలాంటి వ్యతిరేకులైన ఛాందసుల్లో బ్రహ్మయ్యశాస్త్రి అనే ఆయన ఉపన్యాసాన్ని నేను గుంటూరులో విన్నాను.

సంఘ సంస్కర్తల వాదనలు కూడా ఛాందసుల ప్రకృతి నియమాలు, విజ్ఞానము మీద గాక ఏవో కొంత సమంజసంగానూ, మిగిలినదంతా అసమంజసంగానూ వుండే బూజుపట్టిన మత గ్రంథాల మీదనే ఆధారపడి యుండేవి. అయితే అవి పురాతన గ్రంథాలు కాబట్టి వాటిని పవిత్రమైనవిగా భావించేవారు.

ఆనాటి సాంఘిక సంస్కరణల్లో ముఖ్యమైనవి – 1) బాల వితంతువుల (వితంతువులందరు కాదు) పునర్వివాహము; 2) రజస్వల అయిన పిమ్మట బాలికల వివాహము; 3) వరకట్న నిర్మూలనము; 4) స్త్రీ విద్య.

1) ఆ రోజుల్లో అగ్రవర్ణాలైన బ్రాహ్మణ, వైశ్య కులాల్లో బాల్య వివాహాలు చాలా విస్తృతంగా వుండడం వల్ల, బాల వితంతువులుండేవారు. 5 సం॥రాల కన్నా తక్కువ వయస్సు గల వితంతువులు కూడా వుండేవారు. వీరు ఎక్కువగా బ్రాహ్మణ కులంలోనే వుండేవారు. ఈ రెండు కులాల జనాభా షుమారు మొత్తం జనాభాలో 5 శాతం వుండేది. మిగతా 95 శాతం హిందువుల్లో ఈ సమస్య లేదు. సాంఘిక సంస్కర్తలలో హెచ్చుమంది బ్రాహ్మణులే అయి వుండేవారు. అందువల్ల బ్రాహ్మణేతరులందరూ ఈ సంస్కరణలు వారికి ప్రత్యక్షంగా సంబంధం లేక పోవడం వల్ల ఈ ఉద్యమాలకు పూర్తి మద్దతు నిచ్చేవారు. రాజమండ్రిలో కందుకూరి వీరేశలింగం పంతులు గారు, గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణ గారు బాల వితంతువుల పునర్వివాహాలను ప్రోత్సహించి, కొన్ని వివాహాలను జరిపించి గట్టిగా కృషిసల్పిన వారిలో ముఖ్యులు. వీరు జరిపిన వివాహాలన్నింటిలో పెండ్లి కుమార్తెలు 18–25 సం॥ల వయస్సులో వుండి, అందమైనవారు

కాగా, వరులు మాత్రం అంతగా చదువులేని, బీద కుటుంబాలకు చెందినవారు. ఒక పురోహితుడు ఒక వితంతువును పెండ్లాడిన కారణంగా అతని వృత్తిలో బాగా నష్టపోయిన సంఘటన నాకు తెలుసు. చివరికతడు ముష్టి ఎత్తుకొని జీవించవలసి వచ్చింది. అతడు బ్రాహ్మణుడు గాబట్టి ముష్టి ఎత్తుకోవడం అతని హక్కుగా భావించి అందరూ అతనికి సహాయం చేసేవారు. అతని అందమైన భార్య కూడా ఈ పనికి సిగ్గుపడలేదు.

2) ఏ బ్రాహ్మణ సాంఘిక సంస్కర్తకూ తన కుమార్తెకు రజస్వల అయిన తర్వాత వివాహం చేసే ధైర్యం లేదు. దీనికి వాళ్లు చెప్పే సాకు ఏమిటంటే మాకు ధైర్యం వున్నప్పటికీ, మా కులంలో లేదా శాఖలో రజస్వల అయిన అమ్మాయిని కోడలుగా స్వీకరించే ధైర్యం ఎవరికుంటుందని.

3) వరునికి తల్లిదండ్రులు కట్నం తీసుకోవడం ఆ రోజుల్లో నేటిలాగా అంత దురాచారంగా భావించేవారు కారు. అయితే వరకట్నం చాలా స్వల్పంగా వుండేది. అయినా ఏ సాంఘిక సంస్కర్త కూడా ఈ ఆచారాన్ని వదలలేదు. తమ నియమం కోసం తమ అల్లుళ్ళకు కట్నమివ్వడం మానుకున్నారు గానీ, కొడుకులకు కట్నం తీసుకోవడం మాత్రం మానలేదు.

4) స్త్రీ విద్య విషయంలో అంత ప్రోత్సాహం లేకపోయినా వ్యతిరేకత కూడా లేదు. బాలికలు యుక్త వయస్సు వచ్చేదాకా బాలురతో కలిసి చదువుకొనసాగించేవారు. కాని ఆ తర్వాత వారిని చదవనివ్వరు. స్త్రీలు యింటి వద్దనే వుండి పుస్తకాలు చదవడానికి, రాయడానికి అభ్యంతరం లేదు. అలాంటి స్త్రీలు కొందరు వారే స్వయంగా చదువు నేర్చుకొన్నారు. ఆ రోజుల్లో స్త్రీలకు ప్రత్యేకంగా పాఠశాలలు, కళాశాలలు లేవు.

సాంఘిక సంస్కర్తల్లో చాలామంది మంచి స్వభావం కల్గియుండి, ఎలాంటి దుర్గుణాలు లేకుండా స్వచ్ఛంగా వుండేవారు. అయితే వారు అన్ని సాంప్రదాయ పద్ధతులను అవలంబించారు. వాళ్ళ పూర్వీకుల్లాగా వారు కూడా తెలుపు, ఎరుపు, పసుపు వర్ణాలతో అడ్డంగా, నిలువుగా నుదిటి మీద బొట్లు, నామాలు పెట్టుకొనేవారు. కొంతమంది ఆవు పేడతో తయారైన బూడిదను కూడా మొహానికి పూసుకొనేవారు. వారందరూ సాంఘిక సంస్కరణలను సమర్థించినప్పటికీ వారు హిందు మత సాంప్రదాయ విధానాలను పాటించేవారుగా గుర్తింపబడాలని కోరుకొనేవారు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు కూడా ముఖం మీద ఒక సన్నటి ఎఱ్ఱని గీతను వుంచుకొనేవారు. వారు నాతో అప్పుడప్పుడూ

ఈ గుర్తులున్న మఠాధిపతులు వారి వారి అనుచరులు యితర గ్రూపుల్లో కలవకుండా వుండడానికి వాడే చాకలి గుర్తుల్లాంటివని చెప్తుండేవారు. ఈ మఠాధిపతుల (శంకర, రామానుజ, మధ్వాచార్యులు మొ॥వారు) ఆదాయం పడిపోతుందేమోనన్న భయంతో ఈ గుర్తులున్న వారి అనుచరులను తమ దగ్గరే వుంచుకుంటారు.

ఈ సంఘ సంస్కర్తలందరూ అస్పృశ్యతను బాహాటంగా పాటించేవారు. వారి ప్రైవేటు సంభాషణాల్లో కూడా దీన్ని ఖండించేవారు కారు.

నేనొకసారి హైదరాబాదు వెళ్ళినపుడు ఒక బ్రాహ్మణ పెద్ద మనిషి నాకు అక్కడ కొన్ని స్థలాలను చూపించి తర్వాత వారి యింటికి తీసుకువెళ్ళాడు. అతడు తన మొదటి భార్యను కోల్పోయి, మరలా మరొక మధ్య వయసున్న వితంతువును వివాహం చేసుకొన్నాడు. వారిది సరియైన సంబంధమే. ఆ రోజు చాలా ఎండగా వున్నందువల్ల నేను కొన్ని మంచినీళ్ళడిగాను. అయితే అతని భార్య నాకు ఏ రకమైన గ్లాసులో కాకుండా కడుక్కోవడానికి ఉపయోగించే యిత్తడి చెంబులో నీళ్ళు యిచ్చింది. నేను బ్రాహ్మణుడను కాను కాబట్టి ఆవిడ బ్రాహ్మణ సాంప్రదాయాన్ని నా పట్ల పాటించిందన్న మాట. అయితే ఆవిడ ఒక సంఘ సంస్కరణ కార్యకర్తే. నేను నా 12వ ఏట నుండి బ్రాహ్మణులు ముట్టిన ఆహారం గానీ, నీరు గానీ తీసుకోను. అయితే వాళ్ళు సంఘ సంస్కర్తలు కదా అందువల్ల వారికి అందరిలాగా కులతత్వం వుండదన్న వుద్దేశ్యంతో నేను మంచినీళ్ళడిగాను.

సంఘ సంస్కర్తలందరూ ఆస్తికులే. వాళ్ళు బాహాటంగా విగ్రహారాధనను ఖండించకపోయినా, కనీసం వారు మాత్రం విగ్రహారాధన చేసేవారు కారు. కొంతమంది బ్రహ్మ సమాజ సభ్యులలాగా వారు ఎవ్వరూ యూరోపియన్ జీవన విధానాన్ని అవలంబించలేదు.

అన్ని సాంఘిక దురాచారాల్లోకి నికృష్టమైన కులతత్వాన్ని ఏ సాంఘిక సంస్కర్తా వదులుకోలేదు. ప్రఖ్యాత బ్రహ్మ సమాజవాది, సంఘ సంస్కర్త మరియు బ్రాహ్మణేతరుడైన మహర్షి ఆర్. వెంకటరత్నం నాయుడుగారు తన కాపు కుల సమావేశానికి అధ్యక్షత వహించడమే గాక, తమ కులస్థులు బ్రిటీష్‌వారు భారత దేశంలో రాజ్యస్థాపన చేయడానికి వారికెంతో తోడ్పడ్డారని గొప్పలు చెప్పుకొనేవారు. అసలు నిజానికి అనేకమంది కాపులు, నాయుళ్ళు తమ జీవనభృతి కోసం బ్రిటీష్ సైన్యంలో సిపాయిలుగా చేరారు. బ్రిటీష్ వాళ్ళు ఎవరికి వ్యతిరేకంగా వాళ్ళను పోరాడమంటారో అని కూడా ఆలోచించలేదు.

వారు కిరాయి గుండాలలాంటివారు. బర్మాపై బ్రిటీష్‌వారు జరిపిన ఆఖరి దండయాత్రలో ఎక్కువగా నాయుళ్ళతో నిండియున్న ఆంధ్రా రెజిమెంట్ తమకు భోజన, వసతి సౌకర్యాలు సంతృప్తికరంగా లేవని పోరాటం సాగించడానికి తిరస్కరించారు. యుద్ధం ముగిసిన తరువాత భారత బ్రిటీష్ సైన్యాల సర్వ సైన్యాధిపతి అయిన లార్డ్ రాబర్ట్ భవిష్యత్తులో ఆంధ్రులెవ్వరినీ బ్రిటీష్ సైన్యంలో చేర్చుకోవద్దని ఆజ్ఞలు జారీ చేశాడు. దాంతో నాయుడు కులస్థులకు వంశపారం పర్యంగావారికి సంక్రమించిన వృత్తిని కోల్పోయారు. మరలా రెండవ ప్రపంచ యుద్ధంలో ఈ నిషేధం తొలగింపబడింది.

సాంఘిక సంస్కర్తల్లో దేశభక్తులున్నారు. వున్నవ లక్ష్మీనారాయణగారు బ్రిటిష్ రాజ్యాన్ని కూలదోయాలంటే సాయుధ విప్లవం ద్వారానే సాధ్యమని నమ్మిన ఒక విప్లవ దళంలో సభ్యులు.

ఏ సాంఘిక సంస్కర్త కూడా బాహాటంగా గానీ, ప్రైవేటుగా గానీ వర్ణాంతర భోజనాన్ని గానీ, కులాంతర వివాహాన్ని గానీ ప్రోత్సహించలేదు. వున్నవ గారు హరిజనులతో సహా అందరు కులస్థులతో భోజనం చేసేవారు. అందువల్ల వారికి ఆంధ్ర రాష్ట్రంలో ఏ హోటల్‌లోనూ భోజనం పెట్టేవారు కాదు. ఆ రోజుల్లో బ్రాహ్మణేతర భోజన హోటళ్లు (శాఖాహార) లేవు. వారొకసారి గుంటూరు జిల్లాలో బాపట్ల అనే చిన్న పట్టణానికి వెళ్ళినపుడు ఆయన స్నేహితుడు హోటలు నుండి కేరేజ్‌తో భోజనం తెప్పించి అతని యింట్లో వడ్డించాడు. అలాగే ఒక గ్రామంలో ఒక కమ్మ కులస్థుని యింట్లో భోంచేసినప్పుడు ఆ కులానికి చెందిన కొందరు పెద్దలు అభ్యంతరం తెలిపారు. ఒక బ్రాహ్మణునిగా వున్నవ గారికి వారితో భోజనం పెట్టడానికి అభ్యంతరం లేకపోయినా, తమకన్నా తక్కువ కులానికీ చెందిన హరిజనులతోఆయన భోంచేవారు కాబట్టి వారికి అభ్యంతరం వుందని చెప్పారు.

1920లో మహాత్మా గాంధీ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించే దాకా ఈ వర్ణాంతర భోజనం ఆంధ్ర రాష్ట్రంలో ఒక ఉద్యమంగా సాగింది. ఈ సంఘ సంస్కరణలో దక్షిణ దేశానికి చెందిన అయ్యర్‌లు ఎంతో ప్రముఖ పాత్ర వహించారు. వారు రాష్ట్రమంతటా అనేక హోటళ్ళు తెఱచి ఇడ్లీ, ఉప్మా, పులిహోర వంటి పదార్థాలను అన్ని కులాలవారూ కలిసి కూర్చొని తినే ఏర్పాటు చేశారు. ఈ హోటళ్ళు తెరవక ముందు నా బ్రాహ్మణ సహచరులెవ్వరూ మా యింట్లో స్వీట్లు కాని యితర ఫలహారాలు కానీ తినేవారు కారు.

ఆ రోజుల్లో "సాంఘిక సంస్కరణ, రాజకీయ సంస్కరణ కన్నా ముఖ్యమైందా? కాదా?" అనే అంశం చాలా వివాదాస్పదంగా వుండేది. ఎక్కువమంది ప్రముఖులు సాంఘిక

సంస్కరణ, దేశ స్వాతంత్ర్యం రెండు ముఖ్యమైనవేనని భావించేవారు. వీరేశలింగం పంతులుగారు మాత్రం వారిలో దేశభక్తి వున్నప్పటికీ సాంఘిక సంస్కరణలు కేవలం బ్రిటిష్ పాలనలోనే సాధ్యమని దృఢంగా విశ్వసించి, స్వాతంత్ర్య పోరాటంలో పెద్దగా ఆసక్తి చూపలేదు. ఆ రోజుల్లో సాంఘిక సంస్కర్తలను వారి ఉద్యమాలంతగా విజయవంతం కాలేదని కొందరు విమర్శించినప్పటికీ వారి ప్రచారం ముందు తరాల వారికి ఎంతో ఉపకరించిందని కచ్చితంగా చెప్పవచ్చు.

వితంతు వివాహాల కెంతో కృషి చేసిన శ్రీ యిటుకుల సూర్యనారాయణ గారిని మీ భార్య చనిపోతే మీరెందుకు వితంతు వివాహం చేసుకోలేదని నేను ప్రశ్నించాను. వారు నాకు గురువు (1905). ఆ తరువాత వారు న్యాయవాది అయ్యారు. వారంటే నాకెంతో గౌరవం. నా ప్రశ్నకు ఆయన ఏమీ సమాధానం చెప్పలేదు. అయితే వితంతు వివాహం వల్ల ఆ రోజుల్లో ఎన్ని సమస్యలు ఎదురౌతాయో నాకు తెలుసు. అందుకే నేనాయనను నిందించలేను. నేను విదేశాల నుండి తిరిగి వచ్చాక ఆయన నన్ను భోజనానికి వారింటికి ఆహ్వానించారు. అయితే ఆయనకు నాతో కూర్చోని భోంచేసే ధైర్యం లేదు. ఎందుకంటే నేను వైశ్యుణ్ని – ఆయన బ్రాహ్మణుడు కాబట్టి. ఆయన సాంఘిక సంస్కరణల కెంతో కృషి చేయడమే గాక స్వాతంత్ర్య పోరాటంలో జైలుశిక్ష కూడా అనుభవించారు.

"సాంఘిక సంస్కరణ పిత" గా పిలువబడిన హైకోర్టు జడ్జి అయిన మహదేవ్‌రనడే వంటివారే భార్య చనిపోతే 11 ఏండ్ల అమ్మాయిని పునర్వివాహం చేసుకున్నారు. అలాంటప్పుడు ఈ చిన్ని సామాన్య న్యాయవాదిని నిందించడం దేనికి? బౌద్ధ మతం పతనం చెందిన తర్వాత శంకరాచార్యుల వంటి మౌఢ్య మతవాదులచే బ్రాహ్మణత్వం పునరుద్ధరింపబడినప్పటి నుంచి సుమారు వెయ్యి సంవత్సరాలుగా పేరుకుపోయిన ఈ సాంఘిక అరాచకాలు చెత్త చెదారమంతా ఒకటి రెండు తరాల నుండి సాగుతున్న చైతన్యవంతమైన ఉద్యమాలతో పూర్తిగా తుడిచి పెట్టడం కష్ట సాధ్యం.

**ఆంధ్ర రాష్ట్ర అస్పృశ్యతా నివారణ సమావేశం (1921) :**

సహాయ కార్యక్రమంలో అస్పృశ్యతా నివారణ ఒక ప్రధానమైన అంశం. దీన్ని పూర్తిగా అమలు జరిపితేనే స్వాతంత్ర్యం పోరాటంలో అతి ముఖ్యమైన పన్నుల నిరాకరణ ఘట్టం ప్రారంభం కాదు. ఆంధ్ర రాష్ట్రంలోని గుంటూరు పట్టణం ఈ ఉద్యమానికి కేంద్ర స్థానం. ఆంధ్రులంతా పన్నుల నిరాకరణ ప్రారంభించాలని అత్యంత ఉత్సాహంతో

వున్నప్పటికీ, అస్పృశ్యతా నివారణ యింకా పూర్తిగా అమలు జరగలేదు. అగ్ర నాయకులందరూ దాదాపు బ్రాహ్మణులే కాబట్టి అస్పృశ్యతా నివారణ మాటల్లోనే ఆగిపోయింది. అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సభ్యులు, ఆంధ్ర ప్రాంత కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు అయిన దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు ఒక కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో తన యింటి బావి నుండి హరిజనులు నీరు తోడుకోవడానికి వీల్లేదని, అందుకు అనుమతించడానికి తాను సిద్ధంగా లేననీ అయినా నేను మంచి కాంగ్రెస్ వాదిని కానని ఎవరంటారో అనమని బాహాటంగా సవాల్ చేశారు.

అప్పుడు నేను ఆంధ్ర రాష్ట్ర అస్పృశ్యతా నివారణ సమావేశాన్ని ఏర్పాటు చేయవలసి వచ్చింది. నేనప్పుడు జిల్లా కాంగ్రెస్ కమిటీకి కార్యదర్శిగానూ, ఆంధ్రప్రాంత కాంగ్రెస్ కమిటీలో, అఖిల భారత కాంగ్రెస్ కమిటీలో సభ్యునిగానూ వుండేవాడిని. ఈ సమావేశానికి అధ్యక్షుని సంపాదించడం నాకు పెద్ద సమస్య అయింది. చివరకు ఆంధ్రులందరికీ యిష్టం లేకపోయినా డాక్టర్ పట్టాభి సీతారామయ్య గారిని అందుకు ఒప్పించగలిగాను. ఈ సమావేశానికి అగ్రనాయకులెవ్వరూ రాలేదు. ఒక్క గొల్లపల్లి సీతారామశాస్త్రి గారు (తర్వాత 'స్వామి సీతారాం' గా పిలువబడ్డారు) మాత్రమే హాజరయ్యారు. ఏ విధమైన వ్యతిరేకత లేకుండా ఈ క్రింది తీర్మానాలు చేయబడ్డాయి.

1) బైట వున్న బావులన్నింటి నుండీ హరిజనులకు నీటి వసతి కల్పించాలి.

2) దేవాలయాలన్నింటిలో హరిజనులకు ప్రవేశం కల్పించాలి.

3) హరిజనులతో సహా అన్ని కులాల మధ్య కులాంతర భోజనాలు ప్రోత్సహించాలి.

ఈ చర్చల్లో స్వామి సీతారాం గారు పాల్గొనలేదు. యిప్పుడు ఎమ్.ఎల్.సి. అయిన శ్రీ బాపయ్య చౌదరి గారు ఆయనను మాట్లాడమని కోరగా ఆయన తటస్థంగా ఏదో మాట్లాడారు. ఈ తీర్మానాలను ఖచ్చితంగా సమర్థించడానికి ఆయనకు ధైర్యం చాలలేదు.

హరిజన కార్యకర్తలందరకూ నేను భోజనం ఏర్పాటు చేశాను. వండడానికి, వడ్డించడానికి వైశ్యుల్ని నియమించాము. అయితే హరిజనులందరూ ఒకటిగా కలసి కూర్చొని భోంచేయడానికి నిరాకరించారు. వారు మాల, మాదిగలని రెండు కులాలుగా విడిపోయారు. అయినప్పటికీ నేనెలాగో ప్రయత్నించి కలసి భోంచేయడానికి వారిని ఒప్పించాను. సమావేశం ముగిసిన తర్వాత ఊరిలోని వైశ్యులందరూ వంటవారిని సాంఘిక

బహిష్కరణ చేయాలని నిర్ణయించారు. ఆ రోజుల్లో ఏ కులానికి చెందిన వంటవారు కూడా హరిజనులకు వండడం, వడ్డించడం చేయరు. దీనితో నేను చాలా క్రుంగిపోయాను. ఆ వంటవారు వేదాంతి అయిన మా బామ్మగారిని ఆశ్రయించారు. ఆవిడ వెంటనే ఆమె యింట్లో వారి చేతనే వంట చేయించి కొంతమంది వైశ్యుల కుటుంబాలను భోజనానికి ఆహ్వానించారు. ఆ తర్వాత ఆ సమస్య పరిష్కారమయ్యింది.

ఆంధ్ర రాష్ట్రంలో యిలాంటి సమావేశం యిదే మొదటిది. బ్రాహ్మణులైన అగ్రనాయకులందరూ సమావేశానికి హాజరైతే పరిస్థితి మరోలా వుండేది. యువకులైన బ్రాహ్మణులు కాని కొందరు నాయకులు ఈ తీర్మానాలు అమలు జరపడానికి సిద్ధపడినప్పటికీ, వారు కూడా ముఖ్యమైన బ్రాహ్మణ నాయకుల సహకారం కావాలని కోరారు. ఆ యువ నాయకులు ముందుకొచ్చి వుంటే నాయకత్వం ఆంధ్ర రాష్ట్రంలో బ్రాహ్మణుల నుండి బ్రాహ్మణేతరులకు సంక్రమించి వుండేది. భూస్వాముల్లో ఎక్కువమంది బ్రాహ్మణేతరులే కాబట్టి (కమ్మ, రెడ్డి, కాపు, వెలమ మొ॥వారు) హరిజనులకు ఉపకరించే అనేక శాసనాలను, స్వదేశీ ప్రభుత్వం యొక్క భూసంస్కరణల చట్టాలనూ అమలు జరపడంలో వారెంతో సహాయ పడేవారు.

నేను వ్యతిరేకించినప్పటికీ గుంటూరు జిల్లా కాంగ్రెస్ కమిటీ పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని ప్రారంభించాలని తీర్మానించింది. వారు అస్పృశ్యతా నివారణ అమలు జరపక పోయినా గాంధీగారు దానిని పట్టించుకోరని భావించారు. నేను గాంధీజీ అనుమతి కోసం టెలిగ్రామ్ యిచ్చాను. ఆయన వెంటనే దానిని తిరస్కరించారు. నాకు వచ్చిన సమాధానం యిలా వున్నది. “గాంధీజీ మీ టెలిగ్రామ్ అందుకున్నారు. సహాయ నిరాకరణలో అస్పృశ్యతా నివారణ అనివార్యమైనదని గాంధీజీ అభిప్రాయం. దీన్ని విస్మరించే ప్రసక్తే లేదు” క్రింద క్రిష్ణదాస్, సబర్మతి, 25 జూన్ 1921 అని వున్నది.

ఈ సమావేశం ముగిసిన తర్వాత కేవలం హరిజనులే పాల్గొన్న మరొక హరిజన సమావేశం జరిగింది. దానికి ఒక హరిజన కాంగ్రెస్ నాయకుడే అధ్యక్షత వహించారు.

***

# ముగింపు

సంఘ సంస్కర్తల్లోనే కులజాడ్యం మొదలుకొని ఆనాటికి ఎంతో గొప్పవారమన బడేవారి కులతత్వ రంగును, అలాగే దళితుల అనైక్యతను కూడా గుప్తాగారు ఈ వ్యాసంలో స్పృశించారు. అంతేకాదు, అస్పృశ్యత నివారణని విస్మరించే ప్రసక్తి లేనేలేదనే గాంధీజీ అభిప్రాయం మరోసారి తేటతెల్లమయింది.

కరోనా వల్ల దొరికిన సమయాన్ని ఇలా వినియోగించుకుంటున్నాను. ఈరోజు కాకుంటే రేపయినా కరోనాకి మందు మానవాళి కనుగొంటుంది. కానీ ఈ దేశంలోని కులానికి మందు కనుగొనేదెప్పుడో, కులజాఢ్యం నిర్మూలించేదెన్నడో.

ఈ వ్యాసంలో చిత్రించిన సంగతులు చెప్పుకోదగ్గంతగా మారాయని నేనైతే అనుకోవడం లేదు. పైగా కొత్త రూపంలో రోజురోజుకి కులతత్వం పేట్రేగిపోతోంది. ఉన్న పరిమితుల్లో జీవితాంతం ఈ కులంపై బహుముఖ పోరాటం చేయడమే విధిగా పెట్టుకున్నా.

ఈ క్రమంలో సొంత మనుషులనబడే వారి నుండీ బయట సమాజం నుండీ ఎప్పటికప్పుడు ఎదురుకోవాల్సిన విమర్శలు, దాడులు ఉంటూనే ఉంటాయి. ఈ దేశపు ఫాసిజం పేరు బ్రాహ్మణిజం. దానిని అంతం చేయడం అంత సులువు కాదు.

ఆధిపత్య రూపాలైన కులం, మతం, వర్గం, లింగం, ప్రాంతం వంటి వాటిలో తరతరాలుగా అమలవుతున్న ద్రోహం ఎప్పటికైనా తుడిచిపెట్టుకుపోయి ఈ దేశపు బహుజనులు, అణగారిన వర్గాల ప్రజలకి న్యాయం జరగాలనేదే నా ఆకాంక్ష.

అందుకు అడ్డుగా శతాబ్దాల నుండి వేళ్ళూనుకుని ఉన్న ఒక విషవృక్షం కులం. దాని నిర్మూలన కోసం జరిగే అనేక ప్రయత్నాలకు మద్దతునిస్తూ వంద సం॥రాల క్రితం తెలుగు నేలమీద జరిగిన కించిత్తు ప్రయత్నం తాలూకు జాడనిలా పరిచయం చేసి ఇంతటితో ముగిస్తున్నాను.

– గౌరవ్

# ఇతర ప్రచురణలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏమిటి?
3. సాంఘిక తత్వం - వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్థిత్వం-అరాజకత్వం
7. మద్యంపై యుద్ధం
8. మతానికి మరణశాసనం-మనిషికి పునరుజ్జీవనం
9. కరపత్రాల కథా కమామీషు (కరపత్రాల సంపుటి)
10. తత్వ విచారణ-తర్క వివేచన
11. కులానికో సవాలు
12. ప్రకృతి-శాస్త్రం-సమాజం
13. హేతువాద దృక్పథం-విధానపర కర్తవ్యం
14. కలాలు కరపత్రాలు
15. పార్టీరహిత ప్రజాస్వామ్యం సాధ్యమా?
16. శిధిలాక్షరం (కవితా సంపుటి)
17. వ్యవస్థలు-వ్యసనాలు
18. ప్రజా ఉద్యమాల ప్రాతిపదిక
19. తరగతి గది తత్వశాస్త్రం
20. అభివ్యక్తి
21. సాఫల్య జీవులు (ప్రసంగ వ్యాసాలు)
22. మరువలేని మనుషులు-మరుపురాని జ్ఞాపకాలు
23. భారతదేశ పతనానికి ప్రధాన కారణం : కులం

**ఇంటర్వ్యూలు-పరిచయాలు**

24. ధిక్కార స్వరాలు (భావోద్యమకారుల ఇంటర్వ్యూలు)
25. విస్తృత స్వరాలు (కొందరు గాంధేయవాదుల ఇంటర్వ్యూలు)
26. సద్ధమ్మ స్వరాలు (కొందరు బౌద్ధోద్యమకారుల ఇంటర్వ్యూలు)
27. ధీరోదాత్తులు (కొద్దిమంది సామాజిక కార్యకర్తల పరిచయాలు)

## సంపాదకత్వం-సంకలనాలు

28. మద్యపానమా? మానవత్వమా? (మద్యం గూర్చి మహిళల వ్యాసాలు)
29. మానవతకు భరోస (మ.వ్యప్ర.స. అర్ధదశాబ్ధ్యుత్సవ సావనీర్)
30. సహృదీయం (సహృదయ మిత్రమండలి 15 సం॥రాల సావనీర్)
31. పేదల కలలు (అనువాద కథా సంకలనం)
32. సంస్కృతి (సంక్షోభాలు-సంవాదాలు)
33. ప్రత్యామ్నాయ సినిమాలు (దృక్పథాలు-దృక్కోణాలు)
34. మానవీయ ఆసరా స్వరం : మద్యపాన వ్యతిరేకోద్యమం
35. భారతదేశ ప్రజలమైన మేము... (70 సం॥రాల రాజ్యాంగంపై వ్యాసాలు)
36. చదువు అంటే ఏమిటి? చదువులెందుకు? (విద్యపై విభిన్న భావాలు)

## అనువాదాలు

37. పురుషుడు-స్త్రీ (చలం ఏకైక ఆంగ్ల వ్యాసం తెలుగులో)
38. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా..(లోక్‌నాయక్ జె.పి. వ్యాసం)
39. శాస్త్రీయ హేతువాద సామ్యవాది : వివేకానంద (దత్తప్రసాద్ దభోల్కర్ రచన)
40. సాలీడు - ఈగ (విలియం లిబ్నిక్ కథ తెలుగులో)
41. నంది మూపురం (డి.డి. కొశాంబి పిల్లలకోసం రాసిన ఏకైక కథ)
42. ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుందో... (ఠాగోర్ కవితా విశ్లేషణ)
43. చారిత్రక మహోద్యమం-చంపారన్ సత్యాగ్రహం (శతవార్షికోత్సవ ప్రచురణ)
44. స్వేచ్ఛ-సాంస్కృతిక ఆవశ్యకత (ఎమ్మెన్ రాయ్ రచన)
45. మన విద్యా సమస్య (లాలాలజపతిరాయ్ వ్యాసం)
46. ప్రకృతి శాశ్వత ప్రగతి (సుందర్లాల్ బహుగుణ ఇంటర్వ్యూ)
47. జీవితానికి అర్థం ఏమిటి? (ఆచార్య నరేంద్రదేవ్, లోహియా రచనలు)
48. అభివృద్ధి-ఆదివాసులు-హింస (హిమాంశుకుమార్ రచన)
49. మనిషి-మార్జాలం (పానర్డ్ లోర్నెంజ్ కథ)
50. సినిమా కార్యకర్తల కరదీపిక (చల్తీ తస్వీరే ప్రచురణ)
51. నేను-ప్రజలు-ప్రపంచం (పిఠాపురం యువరాజా ఆత్మకథ)
52. భారతదేశంలో బౌద్ధ పతనం (అంబేద్కర్, రాహుల్జీల రచన)